శ్రీ

# అరుణాచల స్తుతి పంచకము

(అనువాదము)

అనువాదకుడు :
గిద్దలూరి నరసింగరావు




ప్రచురణకర్త :
శ్రీ నిరంజనానంద స్వామి
సర్వాధికారి

శ్రీ రమణాశ్రమము
తిరువణ్ణామలై

1936

 [వెల రు 0-2-0



# అరుణాచల దీపదర్శన తత్త్వము.

---

ద్విపద॥ ఈ శరీరమె యాదు నేనను మదిని ।

నాశమొనర్చి పూర్ణముగ, నాబుద్ధి ॥

హృద్వాసియగుచు లోదృష్టివలనను ।

నద్వైత మగు నిజాహం జ్యోతి గాంచు ॥

టరయ భూమధ్యమా యరుణాద్రి దీప ।

దరిశనమ్మై యొప్పు తత్త్వార్థమగును ॥

---



# అరుణాచల మాహాత్మ్యము.

---

నందివాక్కు.

1. తేటగీతము॥

అద్రియే యెంచ స్థల మరుణాచలంబు ।
స్థలములన్నిటిలోన మిగుల నధికము ।
అదియె భూహృదయంబగు నదియె మరియు ।
శివుని హృత్ క్షేత్రమగు మర్మ చిత్ స్థలంబు ।
పతియగు నతడు వసియించు సతతమందె ।
అలరు గిరివేషమున నరుణాచలమున ॥

శివవచనము.

2. ఉత్పలమాల॥

ఉండు ప్రభాతుయాద్రినయి జ్యోతిస్వరూపుడనయ్యునుండుటా।
చందము లోకముక్ కృపనుచయ్యనబ్రోచియనుగ్రహింపగా।
నిందు వసింతు సిద్ధుడన నెప్పుడు, నా హృదిలోన వెల్గి పెం।
పొందును సంతతంబు గుహ భోగసమన్వితమై యెరుంగుమా॥

3. తేటగీతము॥

బంధ మొనరించునట్టి స్వభావముగల ।
సర్వలోక పరుష పాప సంచయ రుణ ।
బంధక నివృత్తి దర్శన మాత్రముననె ।
జేయుటఁ రుణక్షయపదమై యలరెడి ।
పూర్వ తేజోమయారుణ భూధరమిదె ॥

4. తేటగీతము।

చూపు దెలియు యెల్లనుచేరి చూపుగొనిన ।
తలచినను దూరమున బుద్ధివలనకూడ ।
శ్రమపడకగాని వేదాంత సారమైన ।
అర్థవిజ్ఞాన మెల్లరు నందగలరు ॥

5. తేటగీతము॥

యోజనంబులు మూడయి యొప్పు నిచట ।
వాస మొనరించువారగు వరనరులకు ।
ఉండకున్నను దీక్షాదు లోకటిమైన ।
పాశరహితా నా సాయుజ్య ప్రాప్తిసిద్ధ, ।
మౌనుడనగు నాయాజ్ఞచే నెలమిమీర ॥

అరుణాచల మాహాత్మ్యము సంపూర్ణము.



# అరుణాచల అక్షర మణమాల.

---

ద్విపద॥ సాక్షాదరుణగిరీశ్వర పరార్థ్యమగు ।
అక్షరమణమాల సమరించుటకును ॥
కరుణాకరుండగు గణపతి యొసగి ।
కరమభయకరము, కాపాడుగాక ॥

అరుణాచలశివ-అరుణాచలశివ-అరుణాచలశివ-అరుణాచలా !
అరుణాచలశివ-అరుణాచలశివ-అరుణాచలశివ-అరుణాచలా !

1. అరుణాచలమనుచు స్మరియించు వారల
   అహము నిర్మూలింపు మరుణాచలా — అ.
2. * అళగు (అంద) సుందరముల వలె చేరి నేను నీ
   వుందమభిన్నమై యరుణాచలా — అ.
3. లోదూరి లాగి నీ లో గుహాను చెరగా
   సమరించి తేమొకో అరుణాచలా — అ.
4. ఎవరికిగా నన్ను ఏలితి, విడిచిన
   అఖిలము నిందించు నరుణాచలా — అ.
5. ఈ నింద తప్పు, నిన్నేటికి తలపించి
   తిక విడువారెవ రరుణాచలా — అ.

---

*అళఘమ్మ, సుందరమయ్యర్ (భగవాన్ రమణమహర్షుల తల్లిదండ్రులు) లవలె అనియు ధ్వని

6. కనిన జననికన్న ఘనదయాదాయకా
ఇదియా యనుగ్రహ మరుణాచలా అ.

7. నిన్నేమార్చి యరుగనీక యుల్లము పైని
ఉఱుదిగా నుండుమా యరుణాచలా అ.

8. ఊరూరుతిరుగక ఉల్లము నినుగని
యణఁగ నీద్యుతి జూపు మరుణాచలా అ.

9. నను చెఱపి యిపుడు ననుకలువక విడు
టిది మగతనమొక్కొ యరుణాచలా అ.

10. ఏటికీ నిదుర నన్నితరులు లాగగ
యిదినీకు న్యాయమా అరుణాచలా అ.

11. పంచేంద్రియ ఖలులు మదిలోన దూరుచో
మదని నీ వుండవో అరుణాచలా అ.

12. ఒకడవౌ నిను మాయ మొనరించి వచ్చువా
రెవ రిదినీ జాల మరుణాచలా అ.

13. ఓంకార వాక్యార్థ ఉత్తమసమహీన
నిన్నెవ రెరుగు వా రరుణాచలా అ.

14. * అవ్వ బోలె యొసగి నాకు నీకరుణ న
న్నేలుట నీభార మరుణాచలా అ.

15. కన్నుకు కన్నయి కన్నులేక కను నిను
గనువా రెవరు గను మరుణాచలా అ.

16. కాంతమినుమునువలె గవిసి నను విడువక
కలసి నాతో నుండు మరుణాచలా అ.

---

* అవ్వైయార్ అనియు ధ్వని.

17. గిరి రూప మైనట్టి కరుణాసముద్రమా
కృపజేసి నన్నేలు మరుణాచలా అ.

18. క్రింద మీఁదెటను చెన్నొందు కిరణమణి
నా క్రిందుగతిమాపు మరుణాచలా అ.

19. కుత్రమంతయు గోసి గుణముగ పాలించు
గురురూప మైవెలు గరుణాచలా అ.

20. కూచి వాల్గన్నుల కోతబడక కృప
చేసి నఁ చేరి కా వరుణాచలా అ.

21. వంచకా వేడియుఁ కొంచెముఁ కరుగవే
అభయమం చేలుమా అరుణాచలా అ.

22. అడుగ కిచ్చెదు నీదు అకళంక మగుకీర్తి
హానిసేయక బ్రోవు మరుణాచలా అ.

23. హస్తామలక నీదు సద్రసమున సుఖో
న్మాద మొందగ యేలు మరుణాచలా అ.

24. వలనుంచి భక్తుల పరిమార్చు నిను గట్టు
కొని యెట్లు జీవింతు నరుణాచలా అ.

25. కోపరహితగుణ గురిగాగ ననుగొను
కొఱ యేమి చేసితి నరుణాచలా అ.

26. గౌతమ పూజిత కరుణాఘన నగమా
కడగంట యేలుమా అరుణాచలా అ.

27. సకలము కబళించు కరకాంతియిన మనో
జలజ మలర్పుమా అరుణాచలా అ.

28. తిండిని నిన్జేరితిని తిన నా నేను
శాంతమై పోవుదు నరుణాచలా అ.

29. మదిచల్లపడ భద్రకరముంచి యమృతనోర్
తెరు మనుగ్రహచంద్ర యరుణాచలా అ.

30. వన్నెను చెఱపి నిర్వాణమొనర్చి కృ
పావన్నె నిడి బ్రోవు మరుణాచలా అ.

31. సుఖసముద్ర ముపొంగ వాఙ్మనములడంగ
యూరక నమరుమం దరుణాచలా అ.

32. వంచింతు వేల నన్ శోధింప కిక నీదు
జ్యోతిరూపము జూపు మరుణాచలా అ.

33. పదవిద్యగరపి ఈ భూమి మైకము వీడి
రూపగు విద్య జూ పరుణాచలా అ.

34. చేరకున్నను మేను నీరుగ కరగి క
న్నీటేరయి నశింతు నరుణాచలా అ.

35. ఛీ యని ద్రోసిన చేయుకర్మ తపన
గాకేది మనుమార్గ మరుణాచలా అ.

36. చెప్పక చెపినీవు మౌనత నుండని
యూరక నుండువే యరుణాచలా అ.

37. సోమరియైతిని మిన్నని సుఖనిద్ర
కన్న వేఱది గతి యరుణాచలా అ.

38. శౌర్యము జూపితి శమియించె నని మాయ
చలియింప కున్నావు అరుణాచలా అ.

39. కుక్కకు న్నీచమే నే నేగురుతుగొని
వెదకి నిన్జేరుదు నరుణాచలా అ.

40. జ్ఞానములేక నీ యాశదైన్యము బాప
జ్ఞానము దెల్పి బ్రో వరుణాచలా అ.

41. తేటివలెను నీవు వికసింప లేదని
యెదుట నిలుతువేల యరుణాచలా అ.

42. తత్వమెరుగజాల నంతయై నిలుతువే
యిదియేమి తత్వమో యరుణాచలా అ.

43. తానేను తానను తత్వమిద్దానిని
తానుగా జూపింతు వరుణాచలా అ

44. త్రిప్పియహంతను యెప్పుడు లోదృష్టి
గన తెలియునను దే యరుణాచలా అ.

45. తీరముండని యెద వెదకియుతన్ను నే
తిరిగి బొందితి బ్రోవు మరుణాచలా అ.

46. సత్యజ్ఞానములేని యీ జన్మ ఫలమేమి
యొప్పగ రావేల యరుణాచలా అ.

47. శుద్ధవాఙ్మనయుతులం దోచు నీనిజా
హంత గల్పి నను బ్రో వరుణాచలా అ.

48. దైవమనుచు నిన్ను దరిజేరగా నన్ను
పూర్ణనాశ మొనర్చి తరుణాచలా అ.

49. వెదుకక గనిన సచ్ఛ్రీయనుగ్రహానిధీ
మది తెగుల్ తీర్చి బ్రో వరుణాచలా అ.

50. ధైర్యము పరుగిడు నీనిజాహా మరయ
నే నాశమైతి బ్రో వరుణాచలా అ.

51. తాకి కృపాకరము నను కలియకున్న
నిజము నశింతు బ్రో వరుణాచలా అ.

52. దోషరహితనీవు నాతో నైక్యమయి ని
త్యానంద మయ మొన ర్పరుణాచలా అ.

53. నగకు యెడముకాదు నిన్వెదకిన నన్ను
గనుకృపానగ వేసి యరుణాచలా అ.

54. నానలేదె వెదుక నేనయి నీ వొంటి
స్థాణువై నిలచితి వరుణాచలా అ.

55. నీజ్వాల గాల్చినన్ నీఱు సేసెదు మున్నె
నీ కృప వర్షింపు మరుణాచలా అ.

56. నీవునే నణుగ నిత్యానంద మయముగ
నిలుచుస్థితి కరుణిం పరుణాచలా అ.

57. అణురూపు నిన్నునే మిన్నురూపుం జేర
భావోర్మ్ము లెపుడాగు నరుణాచలా అ.

58. సూత్రజ్ఞానములేని పామరు నామాయా
జ్ఞానము గోసి కా వరుణాచలా అ.

59. మక్కి మక్కి కరిగి నే నిన్ను శరణంద
నగ్నుడవై నిల్చి తరుణాచలా అ.

60. నేస్తముండని నాకు నీయాశ జూపినన్
మోసగింపక బ్రోవు మరుణాచలా అ.

61. నవిసి చెడు ఫలము నందేమి ఫలమేరి
పక్వత లోఁగొను మరుణాచలా అ.

62. నొవ్వగింపక నిన్ను నొసగి నన్ గొనలేదె
యంతకుడవు నాకు నరుణాచలా అ.

63. చూచి చింతించి మేనుందాకి పక్వము
చేసి నీవేలి బ్రో వరుణాచలా అ.

64. మాయా విషముపట్టి తలకెక్కి చెడుమున్నె
కరుణప ట్టొసగి బ్రో వరుణాచలా అ.

65. గను కృపన్ మాయాంతముగ కృప గనవేని
గను నీ కెవరు చెప్పు టరుణాచలా అ.

66. పిచ్చివీడ నిను బోల్ పిచ్చిజేసితె దయన్
పిచ్చిని మాన్పు మం దరుణాచలా అ.

67. నిర్భీతి నినుజేరు నిర్భీతు ననుజేర
భీతి నీకేలకో యరుణాచలా అ.

68. అల్పజ్ఞాన మదేది సుజ్ఞాన మేదయా
ఐక్యమంద కరుణిం పరుణాచలా అ.

69. పూ (భూ) గంధ మగు మది పూర్ణగంధముగొన
పూర్ణగంధ మొసగు మరుణాచలా అ.

70. పేరు దలపగనే పట్టిలాగితివి నీ
మహిమ కనుదు రెవ రరుణాచలా అ.

71. పోగ భూతము పోని భూతమై పట్టినన్
భూతగ్రస్తుని జేసి తరుణాచలా అ.

72. మృదులతన్ నేప్రాపు లేకవాడగనీక
పట్టుకొమ్మయి కావు మరుణాచలా అ.

73. పొడిచే మయికపర్చి నాబోధ హరియించి
నీ బోధ గనుపించి తరుణాచలా అ.

74. పోకరాకలులేని సమరంగ దివిజూపు
పా కృపా పోరాట మరుణాచలా అ.

75. భౌతికమౌ మేని పట్టార్చి యెపుడు నీ
మహిమ గన కరుణిం పరుణాచలా అ.

76. మలమందు సీవియ్య మలగుటయో కృపా
మలమందువై వెలు గరుణాచలా అ.

77. మానముగొని చేరు వారి మానము బాపి
నిరభిమానత వెలు గరుణాచలా అ.

78. మించగా వేడెదు కించిజ్ఞుడను నను
వంచింపకను బ్రోవు మరుణాచలా అ.

79. నావికుఁడుండక పెనుగాలి నలయు నా
వనుగాక కాచిబ్రో వరుణాచలా అ.

80. ముడిమూలముల్ గాన మునుకొంటివి సరిగ
ముగియ భారము లేదో యరుణాచలా అ.

81. ముక్కిడి మునుజూపు ముకురముగాక నన్
హెచ్చించి కౌగలిం పరుణాచలా అ.

82. సత్యాహమున మనో మృదుపుష్పశయ్యపై
మేన్గలయ కరుణిం పరుణాచలా అ.

83. మీఁదు మీఁదుగ మ్రొక్కు భక్తుల జేరినీ
వందితే మేలిమి యరుణాచలా అ.

84. మైమైదణచి కృపాంజనమున నీసత్య
వశ మొనరించితి వరుణాచలా అ.

85. మొగ్గ (బోడి) పఱిపి నను ఒట్టబయట నీవు
నట్టాడు టేలకో యరుణాచలా అ

86. మోహముదప్పి నీ మోహ మొనర్చి నా
మోహము తీరదా యరుణాచలా అ.

87. మౌని వై రాయిగా నలరక నున్నచో
మౌన మిది యగునో యరుణాచలా అ.

88. ఎవరు నా నోటిలో మన్నును గొట్టి నా
బ్రతుకు హరించిన దరుణాచలా అ.

89. ఎవరు గనక నాదు మదిని మైకపరిచి
కొల్లగొనిన దెవ రరుణాచలా అ.

90. రమణుడనుచు నంటి రోషము గొనక నన్
రమియింప జేయర మ్మరుణాచలా అ.

91. రేయింబవలు లేని బట్టబయిటి యింట
రమియింపగా రమ్ము అరుణాచలా అ.

92. లక్ష్యముంచి యనుగ్రహాస్త్రము వైచి నన్
కబళించి తుసురుతో నరుణాచలా అ.

93. లాభమీ విహపర లాభహీనుని జేరి
లాభ మే మందితీ వరుణాచలా అ.

94. రమ్మని యనలేదె వచ్చి నా వంతివ్వ
వెఱకు నీ తలవిధి యరుణాచలా అ.

95. రమ్మని లోదూరి నీ జీవ మిడునాడె
నా జీవమును బాసి తరుణాచలా అ.

96. విడిచిన కష్టమా విడక నిన్నుసురును
విడువ యనుగ్రహిం పరుణాచలా అ.

97. ఇల్లువిడువ లాగి లోనింటి లోజొచ్చి
యొగి నీదు యిలుజూపి తరుణాచలా అ.

98. వెలిపుచ్చితి న్నిదు సేత కినియక నీ
కృప వెలిబుచ్చి కా వరుణాచలా అ.

99. వేదాంతమున వేరులేక వెలింగెడు
వేదపదమ బ్రోవు మరుణాచలా అ.

100. నింద నాశీస్సుగా గొని దయాపాత్రుగ
జేసి విడక కావు మరుణాచలా అ.

101. నీట హిమముగ ప్రేమాకారు నీలోన
ప్రేమగ కరగి బ్రో వరుణాచలా అ.

102. అరుణాద్రియననే కృపావలబడితి త
ప్పునె నీ కృపావల యరుణాచలా అ.

103. చింతింప కృపపడ సాలీడువలె గట్టి
చెరపెట్టి భక్షించి తరుణాచలా అ.

104. ప్రేమతో నీనామ మాలించు భక్తభ
క్తుల భక్తుగా బ్రోవు మరుణాచలా అ.

105. నను బోలు దీనుల నింపొందకాచుచు
చిరజీవివై బ్రోవు మరుణాచలా అ.

106. ఎముకలరుగు దాసు మృదువాక్కు వినుచెవిఁ
గొనుమ నా యల్పోక్తు లరుణాచలా అ.

107. క్షమగల గిరి యల్పవాక్కు సద్వాక్కుగ
గొని కావు మరి యిష్ట మరుణాచలా అ.

108. మాలను దయచేసి యరుణాచలరమణ
నామాల దాల్చి బ్రో వరుణాచలా అ.

అరుణాచలశివ-అరుణాచలశివ-అరుణాచలశివ-అరుణాచలా !

అరుణాచలశివ-అరుణాచలశివ-అరుణాచలశివ-అరుణాచలా !

మంగళ మరుణాచలమునకు-
మంగళము భక్తశ్రేణికి-
మంగళ మక్షరమణమాలకును - జయ.

---



# అరుణాచల నవమణిమాల.

---

తేటగీతము.

1. అచలుడే యయ్యు నా సభ యందు తండ్రి ।
అచలయగు నంబ యెదుటాడు అచలరూప ।
మందు నాశక్తి శమియింప నతిశయించి ।
వెలుగు నరుణాచలు డటంచు తెలిసి కొమ్మ ॥

2. సత్య చిత్సుఖము మరి యీశ్వరుడు జీవు ।
డయ్యిరువుర మైక్యం బర్థమైన యట్టి ।
తత్వమసి యే యరుణ పదార్థమగు నచల ।
తార్థము ఘనమదియగు నిండారు శోణ ।
హేమదీప్తిగలిగి స్మరియింప గానె ।
ముక్తి నొస గరుణాచలమును దలతుము ॥

సీసమాలిక.

3. అరుణాద్రిలోనుండు కరుణాకరపరము ।
అరుణారవింద సుస్థిర పదమ్ము ।
వస్తు దేశాత్మీయ వర్ణాదులను బట్టి
కలతిమో బంధముల్ తొలగి యెపుడు

వెలు గరయు మదిని దెలిసి నీ సత్కృప
నిలచువారి తమస్సు నీల్గి భువిని ।
తరుణారుణకర నిత్యానుగ్రహము బొంది
మునుగుదు రా సుఖాంబోధియందు ।

4. అణ్ణామల నినునే నెన్న నటంచు మ
హాఖిన్ను నిగ జేయకయ్య నన్ను ।
మంటి మలిన తను వంటినా నేనని
మన్నుగా సమయున స్లెన్నవలదు ।
నిండుచల్లదనము నిండు కృపాదృష్టి
గనుమ వంచనలేక నను త్రినేత్ర ।
స్త్రీపుంనపుంసకాకృతి లేని జ్యోత్యాకృ
తిఁ ప్రభోనాదు హృదిం జొరగదె ।

5. వెలుగొందు శోణాద్రి చెలువొప్ప వసియించు
చిత్స్వరూపేశ కించిజ్ఞునాదు ।
పెద్ద తప్పుల నన్ని ప్రీతి క్షమించి కా
పాడియు పాడున పడని రీతి ।
కరుణాంబుద కటాక్ష కర మీయ కున్నచో
యీ ఘోర భవతీర మెక్కజాల ।
జనని బిడ్డకు సేయు ఎనలేని మంచికి
నేరైన దుండునే నీవె చెప్పుమ ।

6. కామారి యని భక్త గణముచే నెప్పుడు
వర్ణింప బడుదువు వాస్తవంబె ।

నీ కిది తగునా యనియె యగుచున్నది
నాకు సందియ మరుణాచలేశ ।
ఏరీతి నిజమైన ధీరుడు శూరుడై
నను బలవంతు డనంగు డతడు ।
కామారి యగు నీదు కమలచరణ కోట
శరణంపు మనసులో జొరగ నేర్చు ।

7. అణ్ణామల నను దీనాత్ముని పాలింప
నాడె కొంటివి నా మనస్సు తనువు ।
నా కిక యుండునే యేకొరతయు నైన
కొరతయు గుణమును కూడ నీవె ।
కానిచో యెంచను వీని నా ప్రాణమ
నీ యిష్ట మెదియొ యట్లె యొనర్పు ।
పరమేశ నీపాద ద్వంద్వమందలిభక్తి
నారప్రవాహమే నా కొసంగు ।

8. భువియందు పొంగారు భువినామ పుంగవు
పురియందు తిరుచుళి పుణ్యధవుడు ।
సుందరున కళగు సుందరికి జనించి
యా చోట దుర్విషయముల గలుగు ।
తాప మంతము నంద తనయుల్ల ముప్పొంగ
తనపదమును నాకు దయ నొసంగె ।
చిన్మయము జ్వలింప తన్మయ ముప్పొంగ
జగతి వెలు గరుణశైలవిభుడు ॥

ఉత్పలమాల ॥

9. అమ్మయు నప్పవౌచును ధ
రాస్థలి బుట్టగ జేసి కాచి న ।
న్నమ్మహి మాయ నా బరగు
నట్టి యగాధ సముద్రమందు పా ।
తమ్మును జెంది మున్గుటకు
తద్దయు పూర్వమె నామనంబులో ।
క్రమ్ముచు లాగి నీచరణ
కంజపదంబున నుంచితయ్యా చి ।
త్రమ్మగు చిన్మయారుణ ధ
రావహ నీదు యనుగ్రహం బహో ॥

---



# అరుణాచల పదికము.



(ద్విపదలు.)

1. కరుణతో నన్నేలగా నాకు నీదు।
దరిశనము నొసగి దయ జూడవేని॥
తమమున బాధిలు ధరణి నేమారి।
శ్రమనొంది విడువ దేహమది నాగతియు॥
అరుణుని గానక అలరునే కమల।
మరుణున కరుణుడ వగుచు విరివిగ॥
కరుణచేపి ప్రవాహ సరణిని బారు।
అరుణ ఘనాచల మను ప్రేమ రూప॥

2. ప్రేమరూపారుణాద్రీ యగ్నిమైన।
మైమది నిన్నెంచి పాకమై కరగు॥
ప్రేమహీనునకు నీ ప్రేమ నివ్వాకమొ।
యేమి యంతంబె నన్నేలి చెఱవుట॥
అనురాగ జనిత సౌఖ్యమె భక్తులందు।
మనములో నూరు నిండిన యమృతమ్మ॥

నాశరణ్య భవదిష్టమె నాకు నిష్ట।
మా సుఖమును నాకు నద్ది ప్రాణేశ ॥

3. ఈశు నిన్నెంచు మెన్నిక లేని నన్ను।
వేసి యనుగ్రహా పాశము లాగి ॥
కొని యూపిరియును లేకుండ చంపంగ।
మునుకొంటివేమి చేసిన తప్పు దీను॥
ఊశ యింకను కొరతేల కట్టుసురు।
చేశి యిట్టుల వధించెదవు గా నన్ను ॥
అరుణాచలేశ్వర నెరవేర్చి తలపు।
చిరకాల మొకడవై జీవించి పొమ్మ ॥

4. ఇమ్మహి జీవులం దెల్ల నావలన।
నెమ్మి లాభం బెది నీ వందినావు॥
పడకపాడు నను కాపాడు దీనుడను।
విడక నీపదముల బెట్టినావుకద ॥
వారిధి యగు కృపాస్వామి తలంచ।
చేరును మిక్కిలి సిగ్గును మనము ॥
జీవింపు మరుణాద్రి నీవు నిన్ పొగిడి।
దీవింపగా వంగి పోవు నాతలయు ॥

5. నాయక దొంగతనముగ నన్ దెచ్చి।
నీయొద్ద పదముల నిలిపితిన్నాళ్లు ॥

నీయొక్క తత్వ మేదే యను వార్క।
రాయియన తలను వ్రాలబెట్టితివి ॥
నాయక వలజింక న్యాయముగాక।
నాయల జడికిని నరయుమంతంబు ॥
నాయకుఁడా యరుణాచల చిత్త।
మేయదో యెవడ నే నెరుగంగ నిన్ను ॥

6. ఉన్న నీపదముల నిన్నాళ్లు కంజ।
పున్నాళ మండూకమైతి తత్పరుడ ॥
నేను చిత్పద మధుపాన మధుపము।
గా నొనర్చితివేని గతిగల్గునాకు ॥
వదుల ప్రాణము నీ సుపద పుష్పమందు।
అది శాశ్వత స్తంభ మగు తప్పు నీదె॥
అరుణ కిరణ పూర్ణ గిరిరూప తేజ।
అరయ మిన్నుకు సూక్ష్మమగు కృపాస్థలమ॥

7. స్థల మగ్నిఖంవాయు సలిలముల్ జీవ।
ముల విరినగు భూతములు భౌతికములు ॥
మిన్ను వెలుగ నిను విడచిలే వవ్వి।
యన్న వేరెవరు నేనై యుందు విమల ॥
వేరులేక వెలియై వెలిగిన హృదిని।
వేరని వెలుపల వెడలు నే నెవడు ॥

వెలిరామి యూతని తలనరుణాద్రి।
అలరు విశాల పాదాబ్జము లుంచి॥

8. ఉంచి తూరక భువి నుజ్జీవమార్గ।
మెంచెడు బుద్ధి హరించి యీరీతి॥
ఉంచు కేరికి సుఖముండదు దుఃఖ।
మెంచ హెచ్చగు చచ్చు టే బ్రతుకునకు॥
పట్టి పైత్యంబు నిష్ఫలుడ నీపదము।
పట్టపూర్వపు మందు పెట్టును నాకు॥
ధరణిలో పైత్యౌషధముగ వెల్గరుణ।
ధరణీధరాకార ధరుడగు పరుడ॥

9. పరపట్టులేక నీ పదమును పట్టు।
పరజ్ఞానహీనుల పరముడ నేను॥
భారమునీది నాపనిలేక పనుపు।
భార మెయ్యది యగు భరియించు నీకు॥
పరముడ నిను వేరుపడి యీ ధరణిని।
శిరముపై దాల్చి వచ్చిన యది చాలు॥
పరమారుణాద్రి నీ పదముల నుంచి।
జరుగక నేను వాసము గొన కనుమ॥

10. కనితి ప్రాణుల లాగికొను కాంతశిఖర।
మును క్రొత్తదాని దీని నొకమారెంచు॥

ప్రాణి చేష్ట నణచి వాని లాగికొని।
దాని కభిముఖము గా నొనరించి॥
తనవలె యచలముగ నదిచేసి బలి।
గొనును నా యర్హ జీవుని నిదియే మొ॥
మెలకువ మనుడి జీవులు హృదిలోన।
అలరు జీవ హారి ఘనారుణగిరియె॥

11. గిరి దీని నావలె పరమని యెంచి।
హరియింప బడిన వారది యెందరొకో॥
ఘనబాధ నీ బ్రదుకున యాశవిడిచి।
తనువువీడ యుపాయమును గూర్చి వెదకి॥
తిరుగాడు వా రొకపరి మదిలోన।
స్మరియింప గానె చంపక చంపునట్టె॥
పరమౌషధ మొకటి ధరణినుండదియె।
అరుణ భూధరమన నమరియుం డరయ॥

---



# అరుణాచల అష్టకము.

(ద్విపద మాలిక)

1. అరయరాని గిరిగ నమరియుం డహహా।
అతిశయ మీసేత లరయు వారెవరు।
అరయరాని చిరు వయసు మొద లరుణ।
గిరి చాల ఘనమని యెరుకలో మెరయ।
అరయ లేదది తిరువణ్ణామల యని।
దెలిసియు నొకరిచే దీని యర్థమును।
ఎరుకను మరుగిడి యీడ్వదాపునకు।
అరిగిన సమయమం దచలమై గంటి।

2. కనువా డెవండని మనమున వెదుక।
కనువాడు గనలేక యునికిని గంటి।
కనితిని యనుటకు మనము రాదయ్యో।
కననైతి ననుటకు మనమెట్లు వచ్చు।
పలికి దీని దెలుపగల శక్తు లెవరు।
పలుకక నే ముందు దెలిపితి వనిన।

పలుకక నీస్థితి దెలుపుట కొరకే।
మిన్నుమ న్నచలమై మెఱయంగ నిలుతు।

3. నిన్నురూపునిగ నే నెన్నిచూడంగ।
నిలమీద మలగాను నెలకొంటి వీవె।
నీరూపరూపంచు నెంచుట మిన్ను।
గనభూమి సంచార మొనరించు నటులె।
నీరూపు నెంచక నెంచిన జలధి।
యందు చక్కెర బొమ్మ యన రూపు బోవు।
నన్ను నే నెఱుగంగ నారూపు మరెది।
కల వరుణనగము గా నున్న వాడ।

4. ఉండి వెల్గు నినుగా కొందుట దేవు।
చీకటిఁ దీపముచే వెదకుటగు।
ఉండి వెలుగు నిన్ను నొందనున్నావు।
వివిధ మతములలో వివిధాకృతిగను।
ఉండి వెలుగు నిన్ను నొందక యున్న।
నారవి గానని యంధులె వారు।
ఉండి వెలుగొకడై రెండులేకుల్ల।
మం దరుణాచల అతులరత్నంబె।

5. మణుల సూత్రంబన మత మనేకముల।
ప్రతి జీవి లోపల గతుడొక్కడీవె।

మణిరాపిడిగ మనమును మనోశిలను।
మలము పోరాయ నీ వెలుగందునపుడు।
మణికాంతియన, లేదు మరియొక వస్తు।
గ్రహణము, ఛాయా తగడునందు గగన।
మణిరశ్మి పడ ఛాయపడునె, నీకన్న।
అరుణేశ సత్కాంతి గిరి యొండు కలదె।

6. కల దొండు మెరుకయా వెలుగుల్ల మీావె।
లోన నున్నది యద్భుతానన్యశక్తి।
యందణు ఛాయాచయము, వృత్తి జ్ఞాన।
మునుగూడి, ప్రారబ్ధమను చుట్ల, వృత్తి।
జ్యోతి దర్పణమున చూడనెం నీడ।
లోకవిచిత్రము, లోన నేత్రాది।
ద్వారాన వెలిని, యద్దపుముక్క దారి।
దోచు ఛాయలు పటతుల్య జ్ఞానాద్రి।
నిలువ నిలువకున్న నినువీడి లేవె।

7. అహ మను తలపు లేదన నుండ దన్య।
మది పర కేతలం పుదితమైన నది।
మెవరికి నాకను నేకాహమెందు।
నుదయించు ననియెంచి మదిలోన మునిగి।
హృత్పీఠ మండ నా నేకఛత్రపతి।
పరమహం పుణ్యపాప మరణజన్మ।

తాప సుఖ జ్ఞాన తమము లనబడు।
స్వప్నములేక హృత్సభ నహ మచల।
ముగ నటించు నరుణ నగమను యెల్ల।
లేని స్వయంజ్యోతి జ్ఞాన సాగరము।

8. ఉదధి నెగయు మేఘ ముర్విపర్షించు।
నీరది మున్నీరు జేరుపర్యంత।
మాపినను నిలువ, దటులనే దేహి।
నీయందు వెలువడి నిజ్నేరు దనుక।
కల పలుమార్గాల మెలగి నిలువక,।
అలసియు వినువీధి నిలకడ గనక।
యిల కాక యితర మే నెలవును లేక।
వచ్చిన దారి పోవలయు పక్షివలె,।
మరలి లోపల వచ్చు మార్గమేగ, సుఖ।
అంబుధి నినుబొందు సగుణ భూధరుడ॥
అరుణాద్రి రమణుని అరవకృతియగు
అరుణాచలాష్టక మందు విషయము
తెనుగున తెలుపు నీ ద్విపదమాలికయు.

శ్రీ

# అరుణాచల పంచరత్నములు.

---

(కందములు)

1. కరుణాపూర్ణసుధాబ్ధీ।
కర నికరముచే నిఖిలము కబళించెడి యో।
అరుణాచల పరమాత్మా।
అరుణుడగుమసువికసింప నంబుజమనమున్।

2. జననస్థితివిలయము లె
ల్ల నగును చిత్ర మరుణాచలా నీలో నే।
నను నాత్మవై హృదిని న।
ర్తన మాడుటను వెలసితి హృదయ మనుపేరన్॥

3. నేనని యెందు వెడలునని।
లోనమల మనీషచే విలోకింపంగా।
తానగు రూపమెరిగి నీ।
లో నరుణాద్రి నది యబ్ధిలోవలె నెనయున్॥

4. పోనాడి వెలివిషయములఁ
ప్రాణ నిరోధమున మనసు బంధించి నినుఁ
ధ్యానించు యోగి కాంచును
లోన ననూనమగు నీ వెలుగు నరుణాద్రీ॥

5. మనసును నీకర్పించి య
రుణాద్రి సర్వమును నీదు రూపుగ నెప్పుడుఁ
గనుచు ననన్య ప్రీతిఁ
నినుగొలువ జయించు మునిగి నీసుఖమందుఁ॥

కం॥ అరుణగిరి రమణ కృతమగు
అరుణాచల పంచరత్న మార్యాగీతిఁ
అరుదైన వేదసారము
అరయంగా కందము లివి యనునాదముగ॥

సీసమాల॥

హరి మొదలయిన యితర జీవుల హృదయ
వారిజ గుహాయందు వ్యాపకముగ
ఎరుకయై రమియించు పరమాత్ము డెవ్వడో
అరుణాచలరమణు డగు నతండె
పరభక్తి నుల్లంబు కరుగంగ నత్పరు
డంతట పూర్ణుడై యలరు గుహాను
దరి జేరి జ్ఞాననేత్రంబు తెరచి నిజ
మెరుగగ బట్టబయిలగు సదియు॥

## మంగళము

తేటగీత॥

మంగళంబగు నిత్యంబు మంగళంబు ।
అరుణగిరి ఘన నామంబు కలరు గాత ।
మరియు నా పేరు గల స్తుతి పంచకమున ।
కరవమున పల్కిన రమణ గురుపదమున ।
కాపదం బందు సద్భక్తులందరికిని ।
మంగళంబగు నిత్యంబు మంగళంబు।

ఓం తత్ సత్.



అరుణాచల స్తుతిపంచకము

సంపూర్ణము.





# శ్రీరమణాశ్రమ పుస్తకాలయము.

| భగవాన్ శ్రీ రమణమహర్షి కృతములు. | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| ఉపదేశసారము (అప్పడపుపాట, ఆత్మవిద్యతో) | 0 | 1 | 3 |
| ఉన్నది నలుబది; సద్విద్య; నేనెవరు? | 0 | 2 | 6 |
| **మహర్షి భక్తులు రచించినవి.** | | | |
| శ్రీరమణ చరిత్రము | 1 | 4 | 0 |
| పైదానిని కొనువారికి 'నందనారు' నాటకము వెల | 0 | 3 | 0 |
| ఇతరులకు | 0 | 8 | 0 |
| మాహేశ్వర సూత్రములు | 0 | 8 | 0 |
| అద్వైతబోధదీపిక | 0 | 6 | 0 |
| శ్రీరమణగీత (తాత్పర్యముతో) కాలికో | 0 | 6 | 0 |
| ,, అర కాలికో | 0 | 5 | 0 |
| ,, రాపరు | 0 | 4 | 0 |
| వివేక చూడామణి (వచనము) | 0 | 4 | 0 |
| శ్రీ రమణచరిత్ర సంగ్రహము (ఉపదేశవాక్యాలతో) | 0 | 2 | 0 |
| లాకెట్లు | 0 | 2 | 0 |
| శ్రీ అరుణాచలస్తుతిపంచకము | 0 | 2 | 0 |
| దేవీకాలోత్తరము (జ్ఞానాచార విచారపటలము) | 0 | 1 | 6 |
| విచారసంగ్రహము | 0 | 1 | 6 |
| ఉపదేశమంజరి | 0 | 1 | 6 |
| సర్వజ్ఞానోత్తరే ఆత్మసాక్షాత్కార ప్రకరణం | 0 | 1 | 0 |
| ఆత్మరామాయణం | 0 | 1 | 0 |
| తత్త్వబోధ | 0 | 1 | 0 |
| స్తుతిపాటలు | 0 | 1 | 0 |
| స్వస్వరూపం | 0 | 1 | 0 |
| శ్రీ రమణ మహర్షులవారి చరిత్ర సంగ్రహము (సంభాషణ) | 0 | 0 | 6 |
| ఆత్మ స్వరూపము, దైవాన్వేషణ | 0 | 0 | 6 |
| ప్రణవతత్త్వము ధ్యానము | 0 | 0 | 6 |
| దీపముచూడండి | 0 | 0 | 6 |
| శ్రీ రమణచరిత్ర సంగ్రహము (పాట) | 0 | 0 | 3 |
| శ్రీ రమణ స్తోత్రము | 0 | 0 | 3 |
| జ్ఞానాగ్రస్థితజ్ఞేయ వస్తుయాత్ర | 0 | 0 | 3 |
| ఆత్మధ్యానము అచలము | 0 | 0 | 3 |
| రమణతత్త్వము | 0 | 0 | 3 |

నిరంజనానందస్వామి, సర్వాధికారి.